# అంకితం

'రచనకు కారణమైన
ఆరాధ్య దేవతకు'

కాలం:— 18 వ శతాబ్దము.

## పాత్రలు:

స్వరూప్:— యువ కళాకారుడు. గిరిజాల జుట్టు. సిల్కు-లాల్చి, కంగావి పంచె, నడుముకు రంగు వుత్తరీయం; ప్రశాంత వదనం, ఉద్వేగ హృదయం.

పద్మాకర్:— స్వరూప్ ప్రాణ స్నేహితుడు. హాస్యప్రియుడు. పరిస్థితులు బట్టి గంభీర భావమానసి, స్వరూప్ వలె వస్త్రధారణ, అయితే రంగు తేడా.

లక్ష్మి:— స్వరూప్ సతీమణి, గృహిణి, దైవభక్తి, ఆచారము పాలించే ధోరణి యెక్కువ.

కామిని:— గాయని, ఉద్వేగ హృదయని, ఆత్మ స్థైర్యము గల యువతి.

చంద్రబాబు:— భీమవరం వాస్తవ్యుడు. ఉదార స్వభావుడు స్నేహ పాత్రుడు.

---

# ప్రథమాంకము

## ప్రథమ రంగము

(లక్ష్మి పూజాగృహంలో విగ్రహమునకు హారతి యిస్తూవుంటుంది. స్వరూప్ ప్రవేశం. చేతిలో ముడిచి వున్న చిత్తరువు! తెచ్చిన చిత్తరువు చూపించాలనే వుత్సాహంతో)

స్వరూప్: లక్ష్మి, లక్ష్మి! (ధ్యానముద్రలో వున్నందున నిట్టూర్చి నిలుస్తాడు.)

లక్ష్మి: (హారతి, ప్రసాదము తీసుకవచ్చి) ఇదోనండి దేవీ ప్రసాదము.

స్వ: ఓ. లక్ష్మిదేవీ ప్రసాదమా! మహా భాగ్యం (అంటూ హారతి తీసుకొని ప్రసాద మందుకొంటాడు.)

ల: తప్పు! అలా అనకూడదండీ! పరమేశ్వరీ ప్రసాదం.

స్వ: కళ్ళుండీ గ్రుడ్డివాన్ని ఎలా కాగలను లక్ష్మి. ఎదుట సాక్షాత్కరించి ప్రసాదమిచ్చే ప్రియురాలి వదనంలో దైవత్వాన్ని చూడగలను కానీ...

ల: ఇక చాల్లెండి మీ మెట్ట వేదాంతం...అదేమిటి?

స్వ: మన పూజా మందిరములో అలంకరించటానికి భగ

వంతుని చిత్తరువు తెచ్చాను లక్ష్మీ. ఇదో చూడు. (పటం చూపుతూ) రాధా మాధవ కేళీవిలాసం...

ల: ఛీ, ఛీ! ఏమిటా చిత్రం! ఏమండి, భగవంతుని స్వరూపాన్ని యింత అసంభవంగా యెలా చిత్రించగలిగారండి. పైగా ఈ చిత్తరువును పూజామందిరములో వుంచాలి! అవ్వా! తీసికెళ్ళి మీ గదిలో వేసుకోండి.

స్వ: లక్ష్మీ! ఈ చిత్రాన్ని అపార్థం చేసుకుంటున్నావా! ప్రేమ నిత్యం సత్యం! సౌందర్యమే ప్రేమ, ప్రేమే దైవము. సృష్టికి మూలం ప్రేమే కదూ! ఆ సందేశాన్ని అందించే యీ చిత్రం...

ల: మీ వాదనలకేంగాని, యింతకూ యిలాంటి పటాలు పూజా మందిరములో వుండటం నాకు నచ్చదు. ఆ తర్వాత మీ యిష్టం.

స్వ: నీకంత కష్టమనిపించే పని నేనెందుకు చేస్తాను. తీసుకెళ్తాలే.

(ఇంతలో పద్మాకర్ ప్రవేశం.)

పద్మా: ఓ-చెల్లాయి. ప్రసాదంవేళ తప్పలేదు గదూ! కొంపదీసి...ఏదీ కాస్త దేవుని పేరు జెప్పి యిలా పడేయమ్మా!

ల: ఇదో అన్నాయి,తీసుకో (అంటూ ప్రసాదం యిస్తుంది)

ప: భలే, భలే, భలే తీపు, చెల్లాయి దేవీ మహాత్యమో నీ చేతి చలువో బాగా కుదిరిందమ్మా. ఇంతకూ మా వాడు తీసుకొన్నాడా?

స్వ: ఆ. ఆ. అయింది.

ప: ఇంత తీపూ తిని అలా చప్పగా "అయింది" అంటా వేమిట్రా? అరే యిదేమిటి (అంటూ స్వరూప్ చేతి లోని చిత్తరువు తీసుకొని చూచి) ఆహాహా, ఏమి శృంగారం, ఏమి అందం. ఏం నాన్న, మరి ఈ చిత్త రువుని చూచి కమ్మని పాట అల్లలేక పోయావ్!

ల: వారికా విషయం చెప్పాలా అన్నయ్యా! ఈపాటికి ఏదో ఒకటి వ్రాశే వుంటారు. నీవు వినటమే తరు వాయి.

ప: అల్లాగేం! ఉండుండు తంబుర పట్టుకొస్తాను. నువ్వెళ్ళి పని చూసుకో అమ్మా.

(లక్ష్మి హారతి పళ్లెం దేవుని మంటపములో పెట్టి మ్రొక్కుకొని బయటకు నడుస్తుంది. పద్మాకర్ తంబుర తీసుకొని వస్తాడు.)

స్వ: (పాట) (కన్నడ ఆది తాళము)

ఏ మానందము-భామినీ తలపున
సాయం సమయాన, యమునా తీరాన
రాధా మాధవ కేళీ విలాసము ॥ఏ మానంద॥

జలముల గొని పోవ కలశము చే బూనీ...ఆ ఆ...
ఏకాంతముగా దరియగ రాధ,
"మోహన మురళీ, అనురాగ సరళీ ప్రోగించనహో
మాధవుడూ ॥ఏ మానంద॥

ప్రేమ తత్వమును ప్రతిపాదించే, రాధా మాధవ
ప్రణయ భంగిమల
నింగిని నిలిచి తొంగి చూచి - పొంగి పోయెనహో
జాబిలి మామ ॥ఏ మానంద॥

ప: అంతటితో ఆపివేశావే! పూర్తి కాలేదా!

స్వ: (విచారంగా) కాలేదు, పద్మాకరా! పూర్తి అవుతుం దనే నమ్మకమూ లేదు!

ప: ఎందుకంత నిరుత్సాహము స్వరూప్! రాగ తాళ చందో బద్ధముగా, భావయుక్తంగా వుంది గేయం. పాటకు జీవం పోసేలా యెలుగెత్తి పాడక అసం పూర్తిగ అలా వదిలేయడం నాకు యే మాత్రం నచ్చ లేదు సుమ!

స్వ: అందులో నా దోషమేమి లేదు పద్మాకర్! కవిత నల్లటానికి, రస యుక్తంగా పాడటానికి అవసరమైన ప్రేరణ నాకు జీవితాన లభ్యం కాలేదు.

ప: నీ అభిప్రాయం కేవలం దురూహ్యం స్వరూప్! లక్ష్మీ

సరస్వతుల కటాక్షమునకు నోచుకొన్నవాడివి. అపర లక్ష్మిలా యిల్లాలు. ఇట్టి చీకూ చింతా లేని జీవితమే నీకు ప్రేరణ నివ్వలేకపోతే యిక జీవితాన నీకు లేనిది, లభ్యం కానిది ఏదో అవగాహనవటం లేదు.

స్వ: నీకే గాదు. నాకు గూడ అవగాహన కాలేదంటే నమ్ము. ప్రాణ సమానుడువు. నీవద్ద నాకు దాపరిక మేముంది. నేను కోరే ప్రేరేపణ నా గృహ లక్ష్మి నుండి. అదే నాకు లభ్యం కావటం లేదనుకొంటాను.

ప: ఏమిటి! లక్ష్మి విషయమా అంటున్నావ్! చాలా చిత్రంగా వుంది స్వరూప్. ఆమె ఆదర్శ సతి. ఏదీ చెప్పు లక్ష్మి అనురూపవతి గాదా?

స్వ: ఎలా అంటాను.

ప: మరి అనుకూలవతి కాదా!

స్వ: ఎందుకు కాదు.

ప: నీ యెడ వినయ విధేయతలతో మెలగుట లేదా?

స్వ: బాగా మెలగుతుంది.

ప: పోనీ అత్తమామల సపర్యలు చేయటంలో కాని పిల్లల పోషణలోగాని లోపమున్నదా!

స్వ: అబ్బే అదేమీ లేదు!

ప: అయితే యిక వున్నది నీకు తెలివి లేకపోవుటన్నమాట.

యింతకు నీవు ఆమెనుండి కోరేదేమిటో అదైనా చెప్పు.

స్వ: ఏమని చెప్పను. నా మానసిక ఉద్వేగానికి, కళాపిపాసకు తగిన అనిర్వచనీయమైన అనుభూతి ఆమెలో లోపిస్తుం దని నా అభిప్రాయం.

ప: ఓహోహో! అనుభూతులు, సానుభూతులు, పిపాసలు, ఉపాసలు, నాకు అర్థంగావు. గానీ, అదేదో వివరంగా చెప్పరాదూ?

స్వ: నీ కర్థమయ్యేలా యెలా చెప్పడం. నా దృక్పథంలో అర్థాంగి, రుక్మిణి, సత్య, రాధల నైజగుణముల తనలో యినుమడించుకొని వుండవలె! రుక్మిణి నమ్రత, భక్తి ప్రతిపత్తులు, సత్య రాజసము, రాధ శృంగార రస పిపాసలు, మూర్తీభవించిన యిల్లాలు తగిన సతియగు. ఈ గుణములలో ఏ లోపమున్న జీవితాన ఏదో లేమి కనబడుతుంది. మరి నా విషయంలో కుండ...

ప: చాలు, చాలు, అర్థమయింది. అంతా కృష్ణ ప్రేమ పరంగ మాట్లాడితే, మానవమాత్రులం మేమేమి ఎదురు చెప్పగలం. ఇంతకూ, నీ కవితను, తియ్యని కంఠాన్ని వినే భాగ్యం మాకు లేదన్నది తేలిపోయింది. ఈ ప్రేరణ నీకు ఈ పరిస్థితులలో కలగటం కల్ల. అంతేనా?

స్వ: అంతేనని ఎలా చెప్పగలను. నా జీవితమంత ఆ ప్రేర

ణాన్వేషణలోనే సాగుతుంది. అందరాని అందం, అను భవించలేని ఆనందం, ఏదో నేను పొందగలిగిననాడే, నాలో కవిత ఆవిర్భవిస్తుంది. గానసుధ పొంగి పొరలి పారుతుంది. అంతే పద్మాకర్, అంతే.

ప: సరేబాబు సరే, కాల మిప్ప వలసిన చిక్కు యిది. ఈ అన్వేషణ పర్యవసానంగా, కాకిని కోకిల చేస్తావో, లోకంలో ఒకడైపోతావో ఎవరు చెప్పగలరు. వస్తానయ్యా. శెలవు మరి! (నిష్క్రమణ)

(లోపలనుండి లక్ష్మి)

ల: ఏమండీ, వడ్డన పూర్తి అయింది. మడిగట్టుకొని వస్తారా!

స్వ: ఆ, ఆ. ఇదే వస్తున్నా (నిష్క్రమిస్తూ వుండ)

(నూతనుని ప్రవేశం. పేరు చంద్రబాబు)

నూ: అయ్యా, స్వరూప్‌గారి యిల్లు ఇదేనా?

స్వ: ఔనయ్యా! మీరెవరు?

నూ: నన్ను చంద్రయ్య అంటారండి. భీమవరం రవిశంకరం గారు తమకీ వుత్తరం అందించి సమాధానం తీసుకు రమ్మన్నారండి!

స్వ: అలాగా! యిలా యివ్వండి. (వుత్తరం చదువుతూ వుండగా లక్ష్మి ప్రవేశం)

ల: ఏమిటండీ లేఖ?

స్వా: భీమవరంలో సంక్రాంతికి సంగీత పోటీలు జరుపుతున్నారట. కార్యదర్శి అందులో పాల్గొనవ ఆహ్వానమంపినాడు.

ల: శుభం.

స్వా: అయ్యా! స్నానంచేసి భోజనానికి లేవండి. ఇంతలో సమాధానం వ్రాసి యిస్తాను. లక్ష్మి స్నానానికి ఏర్పాటు చెయ్యి!

ల: అలాగే (నిష్క్రమణ)

చం: అయ్యా! తమరు భీమవరం వచ్చినపుడు మా యింటిలోనే బస చెయ్యగోరుతాను.

స్వా: సంతోషము. మరి రండి స్నానాలగది చూపుతాను. (నిష్క్రమణ)

—:తెర:—

# ద్వితీయ రంగము

(చంద్రయ్య గృహం. చంద్రయ్య కూర్చొని వుంటే కామిని ప్రవేశం)

కా: చంద్రబాబుగారూ! స్వరూప్‌గారింకా రాలేదా?

చం: రామ్మా! కూర్చో! వాహ్యాళి కెళ్ళినవాడు యింత వరకు రాలేదు. వస్తూ వుంటాడనుకొంటాను. (కామిని కూర్చుండును) చాల సంతోషమమ్మా. మా అతిథు లిరువురు పోటీలలో విజయలక్ష్మిని వరించి సన్మానం పొందటం మహదానందముగ వుంది.

కా: సన్మానం పొందటం వరకేగాని, ఆయన శక్తి సామర్థ్యములముందు నేనేపాటి చంద్రబాబు! వారి "గీతమా సంగీతమా!" గేయం నేను జీవితంలో మరువలేను.

చం: చాలా బాగుందమ్మా! మీ కంఠ మాధుర్యాన్ని గూర్చి ఆయన ఎంత గొప్పగా చెప్పుకొంటూ వున్నాడు! కళాకారులు ఒకరి మన్ననలు ఒకరు యిలా పొందటం ముదావహం. మీరు పాడిన గీతిక చరణాల పదే పదే వల్లె వేసుకొని తన్మయుడు కావడం నే చూచానమ్మా!

కా: ఆశ్చర్యంగా వుంది చంద్రబాబు! వారి మన్ననలకు పాత్రురాల నౌవటం నా అదృష్టం!

చం: మీ పరిచయం మహా భాగ్యంగా భావిస్తున్నారాయన. ఆ, అన్నట్టు మరిచాను. ఇప్పుడే కార్యదర్శిగారు కబురం పారు. పోయి వస్తానమ్మా. సేద దీర్చుకోండి.

(నిష్క్రమణ)

కా: (అక్కడే వున్న తంబుర స్రుతి మీటుచు కామిని రాగ మాలపిస్తూ వుంటుంది–అంతలో స్వరూప్ ప్రవేశించి, కొంచెముసేపు ఆలకించి తన్మయుడై–)

స్వ: ప్రకృతి మాత ముద్దు బిడ్డకు, గానకళా విశారదకు నమోవాకులు.

కా: (లేచి నిలిచి) నమస్తే! (సిగ్గుగ) అంతటి బిరుదులకు తగ నండి. దయచేయండి.

(స్వరూప్, కామినులు ఆసీనులైన తర్వాత) ఒకమారు, నిన్న సభలో పాడిన గీతమా, సంగీతమా, అనే గేయం వినిపించరూ. (అంటూ తంబుర అందిం చుతూ, పాడమన్నట్లు అభినయిస్తుంది)

స్వ: (పాట)

ఓ సంగీతమా...ఓ గీతమా...

తెలుపరాదటె జవరాలికి నా మనసు ॥సంగీతమా॥

ఏవాడ వాడనియో! మొగమెరుగని వాడనియో
లేనిపోని సందియాల బాధ నొందనేలని దరియ చేర
రమ్మని ‖తెలుప‖

మధువుగోరు మధుపమేనని, వికసించిన విరియ తానని
యిక యెవరెవరని యడుగనేలనీ
బ్రతుకు బరువు తీరిపోవ! దరియ చేర రమ్మని చేయి
చేయి కల్పమని ‖తెలుప‖

కా: చాలా బాగుంది. ఏమండి తమరు పాడే గేయములు స్వీయ రచనలేనా?

స్వ: అవునండి.

కా: మీరు మరో విధంగా భావించనంటే, మీ రచనల్లో సాక్షాత్కరించే ఆ సుందరి, ఆ అదృష్టశాలిని ఎవరో తెలుసుకోవచ్చా?

స్వ: (ఉద్వేగముగ) ఎవరని చెప్పను? ఆమె అపురూప సౌందర్యవతి, కళామతల్లికి ప్రతిరూపు. ఆమె పలుకులు అమృతసూక్తులు, ఆమె కంఠ మాధుర్యము కోకిల స్వరాన్ని జయిస్తుంది. ఆమె నడక మయూరి నాట్యాన్ని కట్టివేస్తుంది. ఆమె చూపులు లేళ్ళ చూపుల ధిక్కరిస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఆమె దేవతా సుందరి.

కా: ఇంతకూ వూహా సుందరియేనా?

స్వ: ఆదిలో అంతే! ఇప్పుడు ప్రత్యక్ష సుందరి.

కా: అంటే?

స్వ: క్షమించండి. ఇంత చనువుగా సంభాషించటంవల్ల మిమ్మల్ని నొక్కమారు ప్రశ్నిస్తాను.

కా: తప్పక, అడగండి.

స్వ: మరి, ఒకవేళ నా రచనలలో సాక్షాత్కరించే సుందరి తానేనని, నానోట, ఓ లావణ్యవతి వినినపుడు, ఆమె ఆ విషయాన్ని యెలా స్వీకరిస్తుంది?

కా: (సిగ్గు, అంతలో దృఢమనస్కయై) మీ ప్రశ్న... ప్రశ్న...ఎలా స్వీకరిస్తుందా...చాలా బాధాకరముగా.

స్వ: (నిరాశతో) అంతేనంటారా? ఎందుకో చెప్పగలరా?

కా: ప్రకృతిలో ప్రణయాన్వేషణ సాగించి, ఊహాపథాన విహరించి, దివ్యస్వరూపాలకు జీవం పోయటం సబబు. అలా కానప్పుడు, బాహ్య సౌందర్యమునే ధ్యేయముగా వుంచుకొన్న, కళకు అపచారం. కవితకు విఘాతం తప్పదు. అది సహించరాని విషయం.

స్వ: మీ భావన బోధపడటంలేదు.

కా: మీరీ కథ విన్నారా స్వరూప్! ఒకానొక కాలంలో ఒక కవి బాహ్యసౌందర్యమునకు భ్రమసి, ఒక

యవ్వని ప్రేమకు బానిసమై, ఆ వెర్రిలో కవితకు స్వస్తి చెప్పాడట. కవితా స్రవంతికి అడ్డు తానేనని తెలుసుకొన్న ఆ జవ్వని, కళకోసం, ఆత్మహత్య చేసుకొని తనకు దూరమయ్యిందట.

స్వ: విన్నానండి. విన్నాను. కాని, తమరికి ఎదురుచెప్ప సాహసిస్తున్నందులకు క్షమించండి. తమరు శెలవిచ్చిన ఉపమానము, భోగలాలసుడై కావ్యకన్యకను త్యజించిన, ఒక రసికుని విషయమున, అనుపమానమై యున్నది. కాని యిచ్చటి పరిస్థితులు వేరు. ఆ యువ్వని, అతని ప్రేమను అంగీకరించి, జీవితమంతా ప్రేయసిగా నుండ సమ్మతించిన, కావ్యకల్పనకు దివ్యప్రేరణ కలుగునెడ? ఆమెయొక్క సహచర్యము అతనిలో నిద్రాణమై యున్న సృజనాత్మకశక్తిని మేలుకొల్పి, అతని స్వరానికి ప్రాణము నియ్యగలుగునెడ, బాధాకరముగ, విషయమును స్వీకరించుటకుగాని, ఆత్మహత్య జేసుకొనుటకుగాని, తానేల—డిది...ఏమంటే ఏమంటారు?

కా: (మౌనముగా వుండి) నేనేమి చెప్పలేకపోతున్నాను క్షమించండి...అదుగో చంద్రబాబు వస్తున్నారు.

చం: కళాకారులిరువురు యేదో దీర్ఘ సంభాషణలో మునిగి యున్నారు.

కా: ఏమిలేదు చంద్రబాబు! ఏదో వుబుసుపోకకు లోకాభి రామాయణం.

చం: సరే యిక భోజనాలకు లేవండి. ప్రొద్దయింది. మరో శుభవార్త. ఎల్లుండి మీ యిరువురి గానకచ్చేరి, మరో సన్మాన సభ ఏర్పరచారు. మీ తరఫున ఒప్పుకొని వచ్చాను. ఏమంటారు?

స్వ: ఏమంటారు? కామినిగారి అభ్యంతరము లేకపోతే సరే నంటారు.

కా: గురుతుల్యులు మాట కాదనటానికి నేనెవరు?

చం: సంతోషం. పదండి పోదాం.

(తెర)

# మూడవ రంగము

(తెర ముందుభాగం—కామిని ప్రవేశం. ఒకటి రెండు మారులు వెనుకకు, ముందరకు నడిచి)

కా: (స్వగతం) స్వరూప్! స్వరూప్! అబ్బా ఏమిటీ వింత సమాగమం? అనుకోని ఈ కలయిక జీవితంలో మాయని మచ్చలా ఏర్పడేలాగుంది. స్వరూప్ కళా హృదయం నన్నయస్కాంతములా తనవైపు లాగు కొంటూ వుంది. పురుషులంటేనే ఏవగించుకొనే నేను, ప్రేమనేది పిచ్చి అనుకొనే నేను, వివాహము స్త్రీ స్వాతంత్ర్యానికి ప్రతిబంధకమనుకొనే నేను, యిలా అతని సన్నిధిలో తన్మయత్వం చెందుతున్నానే. విధి వ్రాత ఎలా వుందో!

కాని అతడు వివాహితుడు. అతని ప్రేయసి కావటం దుస్సాధ్యం. తోటి స్త్రీకి తీరని అపచారం. ఎంత పాపానికి వొడిగట్టుతున్నాను. ఛీ ఛీ...ఇక అతనిని చూడటంకూడ గర్హ్యనీయము. (రెండడుగులు వెనుకకు నడిచి)

అబ్బ! స్వరూప్! నిన్ను చూడకుండ నీతో మాటాడ

కుండ వుండలేకపోతున్నానే! ఎంత దౌర్బల్యము. నీ కవిత గాన నైపుణ్యత నన్ను వివశురాలిని జేస్తోంది. వస్తాను. నిన్ను చూడాలి. నీ తియ్యని మాటలు వినాలి. (ముందుకు నడిచి)

అబ్బా! సంఘం, నీతి న్యాయం నా కాళ్ళకు సంకెళ్ళు వేస్తున్నాయి. నీ దగ్గరకు నే రాలేను స్వరూప్. క్షమించు. నేను దురదృష్టవంతురాలను. (ఆగిపోతుంది) అబ్బబ్బ, ఇదో యవ్వనం, ఇదో కళాభిమానం యీ సంకెళ్ళను ఛేదిస్తున్నాయి. నాలో చైతన్యాన్ని రేకెత్తిస్తున్నాయి. నిన్ను చేర ఆశలు రెక్కలు గట్టుకొని నాలో చేరాయి. నిన్ను చూడందే వుండలేను. స్వరూప్, వస్తున్నా (అంటూ నిష్క్రమణ)...

(తెర ఎత్తేసరికి స్వరూప్ ఏదో వ్రాసుకుంటూ కూర్చొని వుంటాడు. కంగారుగా కామిని ప్రవేశం. వచ్చి తదేక దృష్టితో స్వరూప్‌ను చూస్తూ ఆగి పోతుంది. స్వరూప్ తిరిగి చూచి)

స్వ: ఓ కామినీ! అలా వున్నావేం? ఒంట్లో కులాసాగా లేదా? కూర్చోండి.

కా: ఏదో తీరని బాధ స్వరూప్. క్షమించండి మీ పని కంతరాయం కలిగించానేమో!

స్వ: అబ్బే! అదేం లేదు. మీ రాక సముచితముగా వుంది. రేపు కచేరీలో పాడుటకు ఓ యుగళ గీతిక వ్రాస్తూ వున్నాను. మధ్యలో కలం ఆగిపోయింది. ఇది పాడటానికి, పూర్తిచేయటానికి, మీరే తగినవారని...

కా: నాకంత యోగ్యత లేదు స్వరూప్. ఏదీ వినిపించండి సాగినంతవరకు రచన.

స్వ: ఇదో...

నాయకు: మనసు లోపలి మధుర భావములు
తనువుదాల్చెనే చెలియ, నీ మనసు దాపకే
వలపులిల్కు చెలియ;

నాయకి: కోరబోకు మోయి - రూప కల్పనల
ప్రణయసుందరిని నీవు.
ప్రకృతి లోపల ప్రణయాన్వేషణ
స్వార్థరహితమోయి రసికా
నను కోరబోకు మోయి రసికా

(ఏదీ ఈ చరణాలనండి. ఊఁ—కామిని పల్కుతుంది)

నాయకు: ఆమని కోయిల మధుర గీతములు ॥ఆ॥

స్వ: అంతటితో ఆగిపోయింది-ఏమని వ్రాయను?

కా: ఓ......

నాయకు: ఆమని కోయిల మధుర గీతములు

నాయకి : ఓ రసికా? ఏమనెనో?

స్వ: బాగు, బాగు మరల అనండి.

కా; ఓ రసికా ఏమనెనో.

స్వ: (వ్రాస్తూ) ఏమనెనా?

చెలియ సమ్మతమె కావ్యకల్పనకు
దివ్య ప్రేరణంచు - స్వార్థరహితమే వలపు
దైవమని చెలికి తెల్పుమనెనే-నా చెలికి తెల్పమనెనే॥

ఇరువురు:—ఓ.........(పాట ముగిసాక యిరువురు నవ్వు కుంటారు)

స్వ: ఎలావుంది కామిని?

కా: స్వరూప్ కంఠ మాధుర్యంలా వుంది. అద్భుత రచన.

స్వ: ఇంతకు కోయిల మధుర గీతములు నా చెలికి తెల్ప మన్నాయి; చెలియ సమ్మతం కావ్య సంకల్పనకు దివ్య ప్రేరణయని-మరి చెలి ఏమంటుందో!

కా: (సిగ్గుతో) చెలియ సమ్మతి తెల్పిందని కోకిలమ్మకు తెలియ జెప్పమంటుంది.

స్వ: (సంతోషముతో కామిని చేతులు పట్టుకొని) కామినీ! నిజమా! నిజమా! కామినీ!

కా: (ఉద్వేగంగా) స్వరూప్, (అంటూ అతనిపై వాలి పోతుంది)

స్వ: నేను అదృష్టవంతున్ని కామినీ. నేటికి అందరాని అందము, పొందలేని ఆనందము ఏమిటో నీ పవిత్ర స్నేహంతో చూడగలిగాను. నా కవితా కుసుమము యిక వికసిస్తుంది. నా పాట లోకాల నుత్సాహ పరు స్తుంది. కళామయి, నీ దివ్యప్రేమ నా జీవితానికి ఆశాజ్యోతి. నీ ఋణం ఎలా తీర్చుకోను కామినీ?

కా: నేనూ ధన్యురాలిని స్వరూప్! మీ ప్రేయసిగా కల కాలం కళాసేన జేసుకుంటూ జీవితాన్ని సఫలం చేసు కొంటాను! కాని స్వరూప్! ఒక విన్నపము.

స్వ: ఏమది కామినీ!

కా: నీవు వివాహితుడవు! మనది స్వార్థరహితమైన వల పుగా నుండవలెనని నా కోరిక. తుచ్ఛకామమునకు

యిందు తావుండ రాదనుకుంటాను - ఏమంటావ్ స్వరూప్.

స్వ: అంతే కామిని. నీతో నేనూ ఏకీభవిస్తాను. కామతృష్ణ తీర్చుకొనుటకు, గృహస్త ధర్మం, నిర్వహించుటకు, అగ్నిసాక్షిగా వివాహమాడిన యిల్లాలున్నది కామినీ? మన ప్రేమ పర్యవసానంగా, గృహస్థ ధర్మానికి విఘ్నము కలుగనీయనని నీ సాక్షిగా శపథం చేయు చున్నాను. నన్ను అనుగ్రహించు కామినీ!

కా: స్వరూప్! నీవు దైవసమానుడవు. నేను జీవితమంతా నీదాన్ని!

స్వ: చేసిన బాసలు, ఆశలు మాసిన మరువరాదు కామిని!

కా: భగవంతునాన (యిరువురు చేతులు కలుపుకుంటారు స్వరూప్ కామిని చేయి ముద్దెట్టుకుంటాడు)

స్వ: కాము! ఒక్క క్షణం అలా కూర్చో. ఇపుడే మరో గీతిక వ్రాస్తాను. (కామిని కుర్చీలో కూర్చుని)

కా: (కొంటెగా చూస్తూ) నన్ను చూస్తూ వ్రాయాలా?

స్వ: ఆ ఇదో చూడు మొదటి పంక్తి

అల్లరి చూపుల గొల్లపిల్ల ఎల్లాగొచ్చావే
చల్లకొచ్చి ముంత దాచ ఎంత వంత కారివే॥

కా; (చరణములయిన తర్వాత) ఏమండీ! నావి అల్లరి చూపులా! బలేవారండి.

స్వ: కాదామరి (ఇరువురు నవ్వుకొంటారు)

కా: ఇక శలవియ్యండి, సాయంత్రం కలుసుకొంటాను.

స్వ: మంచిది! వెళ్ళిరా కామినీ! (వెనుతిరిగి చూస్తూ కామిని నిష్క్రమణ. రచనలో స్వరూప్ నిమగ్నుడు కాగా తెర వ్రాలుతుంది)

---

# ద్వితీయాంకము

## ప్రథమ రంగము

(తెర ముందర పద్మాకరుని ప్రవేశం. ఒక చేతిలో పరుపు, మరో చేతిలో సంచి, - పరుపు, సంచి క్రిందదించి)

ప: (స్వగతము) ఇదేమి భీమవరంరా బాబు. నడిచేకొద్ది బాట సాగుతూనే వుంది. మన మిత్ర రత్నము సంగీత పోటీలో పాల్గొనడానికి యిక్కడికి రావడం వారం తిరిగిన వెనక్కి తిరిగి రాకపోవడం, చెల్లమ్మ బెంగతో నన్నిటకు పంపడం, మనం యిలా తిరిగి తిరిగి ఆయన గారి బసకోసం అన్వేషణ సాగించడం, వద్దురా బాబు వద్దు. ఇంత జేసి ప్రేరణ లేనిదే రాయలేను రాసినా పాడలేను అని అంగలార్చేవాడు యెందుకు బయలుదేరి రావలె, వచ్చెపో ఆ కాస్త పని ముగించుకొని యింటి దోవ పట్టక యిక్కడేం చేస్తున్నట్టు. అరెరె ఆ వీధి మలుపులో గుర్తు చెప్పిన ప్రకారం యిదే మనవాని బసగానోపు. అయినా పిలుద్దాం. ఏమండి. ఎవరు లోపల.

కా (లోపలనుండి) ఎవరండీ - మీరు.

ప: (స్వగతం) అరె - 'ఎవరండీ! మీరు?' అడగొంతు. ఛా. అదేం మాట. కిన్నెర కంఠము. ఇంతకు నాకు మా వూరిలో తెలిసినంతవరకు చంద్రబాబు మనలాగే బ్రహ్మచారి గదా! మరి ప్రాసాదమున అడగాలి. అయినా తలుపులు తెరుచుకుంటె అంతు తేల్చుకో వచ్చు. (వెలికి) ఏమండీ చంద్రబాబుగారి యిల్లు యిదే నాండీ. ఆయితే కాస్త తలుపు తీస్తారు.

కా: (లోపలనుండి) అలా దయచెయ్యండి. వాకిలి తెరిచే వుంది.

ప: అరెరె, ఇది ప్రవేశ ద్వారము కాదన్నమాట. అటె వస్తున్నానమ్మా, వస్తున్నా (అంటూ పరుపు, సంచి తీసుకొని బరువుగ అడుగులు వేసుకుంటూ నిష్క్రమణ)

(తెర యెత్తగనే)

(పద్మాకరు, కామినిలు కూర్చొని వుంటారు)

ప: ఏమండీ మీరు...అహా...ఈ యిల్లు చంద్రబాబు అనే వారిదే నంటారా?

కా: (నవ్వుతూ) కాకపోతే మీరిక్కడెలా వుండగలుగుతా రండి?

ప: నిజమండీ...నిజం...ఆఁ యింతకు వారు మీకేమౌ తారు?

కా: ఏమీ కారండి, పరిచయస్తులు.

ప: అలా చెప్పండి...అలా చెప్పండి. యింతకూ పరిచ యస్తులంటే...

కా: మీ అభిప్రాయం.

ప: అహాహ! కేవలం ముఖ పరిచయమేనా, లేక చాలా సన్నిహితులా, లేక స్నేహితులా, లేక బంధుగులా లేక.

కా: ఈ లేక లేమి కావండి. శ్రేయోభిలాషులు.

ప: అలా చెప్పారు. బాగుంది. బాగుంది. మరేనండి ఈ యింటికి వారం రోజుల క్రిందట కళ్యాణపురంనుండి ఒకాయన, స్వరూప్ అనే ఓ గాయకుడు వచ్చి ఉండవలె, ఔనా!

కా: ఆ ఆ. ఇదో వారి పరుపు, సంచి.

ప: (మూలలకు చూచి) ఔనౌను అవె, అవె, సరే నేను సరైనా విలాసానికే వచ్చానన్న మాట.

కా: ఏమిటండి ఇప్పుడేనా మీకు సందేహ నివృత్తి కలిగింది. ఇంతకు ఆ స్వాహాప్ గారు తమరికేమౌతారు.

ప: ఏమీ కారండి. పరిచయస్థులు.

కా: అహాహ కేవలం ముఖ పరిచయమేనా లేక చాలా సన్నిహితులా, లేక స్నేహితులా, లేక బంధుగులా లేక...

ప: (లేచి రెండడుగులు ముందరకు నడిచి) (స్వగతం) ఓయబ్బో జాణరా బాబూ నెరజాణ. నాడాడు ఆనాడు చూచాయగా చెప్పిన సత్యరాజసం, రాధ శృంగారము ఈ జాణలో తొణిక లాడ్తుంది. ఇంతకూ మన మిత్రుడు కనబడడే.

కా: ఏమండి పలుకకుండా అలా పోయారు?

ప: అబ్బెబ్బె ఏమి లేదండి. స్వాహాప్ నా మిత్రుడు. బాల్యమిత్రుడు. అంతే చూచారు ప్రాణస్నేహితుడు, ఇంతకూ మా స్వాహాప్ ను మీరెరుగుదురాండి.

కా: ఓ బేషుగ్గా.

ప: అబ్బో, అబ్బో. మరేనండి ఎంత కాలంగానో తెలుసుకోవచ్చా!

కా: వారం రోజులుగా!

ప: ఏమండి, ఏమండి మరేనండి మిమ్ముల్ని చూస్తే గొప్ప కళాకారులుగా అగుపడుతున్నారు! ఔనాండి.

కా: అబ్బే. మీ కళ్ళకు కనబడే 'అంత'గొప్ప కాదులెండి. ఇంతకూ స్వరూప్ మీలాంటి మిత్రులు తమకొక రున్నారని ఎన్నడూ తెలవియ్యలేదే?

ప: (స్వగతం) అబ్బో పేరుతోనే పిలుస్తోంది. ఎంత పరిచయం లేంది, ఎంత చనువులేంది, ఎంత ఇది లేంది, ఎంత అది లేంది! (కామినితో) ఆ అలాగాండి ఔను లేండి, చెప్పివుండడు లేండి. పరిస్థితి లెలాంటివో, మేము వాడికి జ్ఞాపకముండటానికి, ఇంతకూ ఏమ్మా, ఒక్క మాట పోనీ మాట వరుసకైనా మావాడు తనకొక వూరు, ఒక సంసారము, ఒక యిల్లు వాకిలి వుందనైనా చెప్పినాడా.

కా: (రోషంగా) ఏమండీ మీరు మరీ అపహాస్య మాడుతున్నారు. మీ స్నేహితుడు వచ్చే వేళయింది. ఆయన్నే అడిగి సమాచారం సేకరించండి (అంటూ అక్కడవున్న పుస్తకం తీసుకొని పేజీలు త్రిప్పటం మొదలుపెడ్తుంది.)

ప: (స్వగతం) తారా జువ్వ రాబాబు,రంగేళీ రవ్వ!ఏమండీ,

ఏమండీ ఏదో మాట వరసకు అలా అన్నాను. నేను చాలా మంచివాడను సుమండి, కావాలంటే మా వాడిని అడిగి సమాచారము సేకరించండి.

కా: (నవ్వుతూ) మీరు బలేవారండి.

ప: హి హి హి మరేనండి. ఆ మాటన్నారు అంతే చాలు.

(ఇంతలో స్వరూప్ ప్రవేశం)

స్వ: ఓ పద్మాకర్, ఎప్పుడు రాక?

ప: తమరి రాకకు కాస్త ముందుగనే.

స్వ: ఇంటిలో లక్ష్మి పిల్లలు కులాసా?

ప: ఆ, ఆ. నిక్షేపంగా.

స్వ: (కామినితో) అన్నట్టు మరిచాను కామినీ, వీరు నా....

ప: అంతటితో ఆపునాన్న. చెప్పకోదగ్గవన్నీ ముందుగ నేనే చెప్పుకున్నానులే!

స్వ: మరి యీ ామె...

ప: ఆపునాన్నా ఆపు. తెలుసుకోతగ్గంత ఈ పాటికే తెలుసుకున్నా.

స్వా: అయితే నాకు చెప్పటానికేమీ లేదన్న మాట. కామిని కాస్త కషాయం చేసి తీసుకురా. నిన్నటి యుగళ గీతి మరొకమారు వల్లె వేసుకొందాం.

కా: అలాగేనండి (నిష్క్రమణ)

ప: మిత్రమా! యింతకూ ఎవరీ భామిని? పేరుకు తగ్గట్టుంది.

స్వా: అంతా ముందే తెలుసుకొన్నా నన్నావుగా. ఇక నే జెప్పడమెందుకు?

ప: ఏడ్చినట్లేవుంది. ఆమె సముఖంలో తెలుసుకోతగ్గ విషయాలు తెలుసుకొన్నా. ఆమె పరోక్షములో తెలుసుకోతగ్గ విషయాలుంటవిగా?

స్వా: అలాగా! ఈమె ఓ ప్రఖ్యాత గాయని. కళామయి.

ప: ఆ విషయం మనిషిని చూడగానే అనిపించిందిలే.

స్వా: ఆమె ప్రౌఢ.

ప: అది అనవసరము. ఇంతకూ నాకు కావలసింది ఈ కామినితో నీ పరిచయం ఎంతవరకా అని.

స్వా: ఆమె నా ప్రేయసి–నా కవితకు ప్రాణం. నా పాటకు జీవం.కలకాలం కలగన్న అందలేనిఆనందం అనుభవించలేని ఆనందం నేనామెలో చూడగలిగాను పద్మాకర్.

ప: చాల్లేవయ్యా! ఆపు. కొంపకు కబురంపక యిలా జాగు చేసినప్పుడే. నేననుకొన్నా-ఏదో యిలాంటి ఉపద్రవం జరిగి వుంటుందని...ఆ. స్వరూప్! ఇల్లు వాకిలి పిల్లా జిల్లా సంసారము వదలి యిలా పరస్త్రీ వ్యామోహంలో పడి నాశనమౌతావా! ఏమిటీ వికృత చర్య!

స్వ: నీవు పొరపడుతున్నావు పద్మాకర్. నన్నపార్థం చేసుకొంటున్నావు. ఇక్కడ మీద మీద కచ్చేరీలు ఏర్పాటు అగుటవల్ల తీరిక లేకపోయింది. అంతేగాని, నా మానానికి వేరే కారణం ఏదీ లేదు.

ప: నే నమ్మను. ఈ వగలాడి వయ్యారి అడుగులకు మడుగు లొత్తుతూ బాధ్యతా రహితంగా ప్రవర్తించడం హేయమైన విషయం. రానీ ఆ మనిషితోనే అంతు తేల్చుకుంటా.

స్వ: నోర్మూయి! ఏమిటా ప్రేలుడు. అసలు విషయం తెలియక ఆమెను నీచంగా మాటలాడటం అవివేకం.

ప: కళ్ళు తెలియని స్థితిలో వివేక హీనుడవైనావు. కామెర్లున్న కళ్ళకు లోకం అంతా పచ్చగా కనబడినట్లు నీ అవివేకములో నన్ను అవివేకిగా చూడగల్గుతున్నావు. అంతే!

స్వ: క్షమించు పద్మాకర్! ఏదో ఆవేశంలో అన్నాను. కాని ఒక్కటి నిజం, భగవంతునాన, నా తలితండ్రు లాన, ఆమెతో శారీరక సంబంధం నాకేమాత్రం లేదు. పవిత్ర మానసిక ప్రేమ మాత్రం మాలో పూవున తావి మాదిరి యిమిడి వుంది. నన్ను నమ్మలేవా? పద్మాకర్! నీవే నమ్మలేకపోతే లోకం ఎలా నమ్ము తుంది.

ప: ఏవోలే! కాని స్వరూప్ ఒక్కటి మాత్రం నొక్కి చెబు తున్నాను. ఈ మానసిక ప్రేమ నీ వరకు శాశ్వితము గావచ్చు. కాని దీని పర్యవసానము మంచికన్న చెడే ఎక్కువ వుండునని నాకు భయంగా వుంది.

స్వ: ఎందుకలా అంటున్నావ్? పద్మాకర్.

ప: స్వరూప్! నీ మనస్తత్వం నాకు బాగా తెలుసు. నీవు విషయాలను తేలికగా తీసుకోలేవు. పైగ పరిస్థితుల లొంగదీసుకొని నడుచుకొనే బదులు పరిస్థితులకు లొంగి పోవటం నీ నైజ గుణము. నూతన యువతి ప్రేమ శాశ్వతమని ఎలా నమ్మకం. కొద్దిపాటి పరిచయంలో ఒకరి నొకరు బాగా తెలుసుకో గలిగారని నే నను కోవటంలేదు. ఒక వేళ ఏ పరిస్థితులలోనైనా ఆమె మనసు మార్చుకుంటె...

స్వ: అలా అనకు పద్మాకర్! కామిని దేవత.అలా ఎప్పుడు జరుగదు.

ప: లేక స్త్రీకి సహజమగు స్వార్థమామె నావహించి నిన్ను పూర్తిగా తనవాడిగా చేసుకోవాలనుకుంటే?

స్వ: అబ్బ, ఆమె పవిత్ర హృదయం అంత నీచస్థితికి దిగ జారదు. ఆమె కారణజన్మురాలనిపిస్తుంది. లేని సందే హాలతో, అమంగళ వాక్యాల అపస్మృతులతో నాకు కష్టము కలిగించవద్దు పద్మాకర్.

ప: ప్రాణస్నేహితుడవుగాన కీడెంచి మేలెంచమన్నట్లు, కటువైన కొన్ని మాటలు చెప్పక తప్పలేదు. విద్యా వంతుడవు. అనుభవశాలివి. నీకు నేనేం చెప్పగలను స్వరూప్. కానున్నది కాకమానదు. మనమూ నిమిత్త మాత్రులమే గదా! సరే పోనీ. మరల యింటికి ప్రయాణ మెప్పుడో నిర్ణయించుకొన్నావా?

స్వ: రేపు సాయంత్రము బయలుదేరుదాము! వీలైతే కామిని కూడా మనవెంట వస్తుంది.

ప: నీ యిష్టం.

(ఇంతలో రెండు గిన్నెలలో కషాయం తీసుకొని కామిని ప్రవేశం)

కా: (స్వరూప్ కిచ్చి) మీరూ తీసుకోండి పద్మాకర్ బాబు.

ప: ఏమిటమ్మా! కషాయమా! చేదు...అమ్మా లోకా నికి మాధుర్యాన్నియ్యటం కోసం, మీ ఇరువురు చేదు మ్రింగక తప్పలేదు. మావరకెందుకులే తల్లీ!

స్వ: మరి నీకేం కావాలోయి.

ప: కాస్త తీపు ఏదైనా సరే! తాము చేదు మ్రింగియైన పరులకు తియ్యదనాన్ని అందించవలసిన అగత్యం మాకేం లేదుగా. ఇప్పుడిక ఏమీవద్దు కాని, మీ తియ్యని గాన సుధ నోకింత వొలకబోయండి. అంతే చాలు.

(స్వరూప్ తంబుర మీటుతూ పాట మొదలు పెడ తాడు. యుగళ గీతికను కామిని అందుకొంటుంది.)

స్వ: (పాట) అల్లరి చూపుల గొల్లపిల్ల ఎల్లాగొచ్చావే
చల్లకొచ్చి ముంత దాచ ఎంత వంత కారివే.
నీవెంత వంత కారివే.

కా: మది నిను మెచ్చానోయ్, హృది నీకిచ్చానోయ్
నవ్వుల పాలుసేయకోయి – కమ్మని చూపుల
ఏలుకో – గోపాల నన్నేలుకో

స్వ: రయమున పొంగె యమున, రాగమొదవెను
హృదయమున

కా: రాగభరితమౌ మురళీ రవము వినిపించెనురా
గోపాలా నను మురిపించెనురా, నిను చేరా ॥అల్లరి॥

స్వ: మనమే నందన వనమై వెలయగ
విరిసిన రోజా నేనై తరియగ

ఇరువురు: ఇరువుర మొకటై, మెరయుదమా
అనవిరియె మెరయగ హాయి, హాయిగా ॥ఆ॥ ఆ॥

ప: భళీ! తన్మయత్వాన వెలువడిన ఈ గేయ గులాబి, కళామ తల్లికి శిరోమణి. స్వరూప్ మీ స్నేహం యిలాగే చిరకాలం వర్ధిల్ల చేయాలని, మీ జంట కళకు జీవిత నంకింతం చేసి, ఎల్లకాలం రసజ్ఞుల మన్న నల పొందులాగున దీవించాలని భగవంతుని ప్రార్థిస్తూ వున్నాను.

(ఇంతలో చంద్రబాబు ప్రవేశం)

చం: స్వరూప్, మహాశయా, సభికులంతా వచ్చారు. తమ రాకకోసం ఎదురు చూస్తున్నారు. పదమ్మా కామిని. (పద్మాకరు నుద్దేశించి) వీరెవరు?

ప: నేనాండి, నన్నడగండి చెబుతును. యీ కళాకారు లకు చిరపరిచితుణ్ని. పద్మాకరుడంటారు.

చం: అల్లాగా! నమస్తే. పదండి పోదాం.

—:తెర:—

# ద్వితీయ రంగము

(తెర ఎత్తేసరికి స్వరూప్ విచారంగా కూర్చొని వుంటాడు. కామిని వుత్సాహంగా ప్రవేశించి స్వరూప్‌ని చూచి మెల్లగా అడుగులు వేస్తూ, వెనుకకుపోయి కళ్ళు మూస్తుంది.)

కా: (బాధగ) ఏమిటది స్వరూప్, కంట తడిబెడుతున్నావు! ఏమి యిలా వున్నారు! (అంటూ ముందుకు వచ్చి ప్రక్కన కూర్చొని అతని చేతిని తన చేతులోకి తీసుకొని) మీరిలా దిగులుగా వుండటను నే చూడలేను. ఎందుకీ ఆవేదన? చెప్పరు!

స్వ: ఏమని చెప్పమన్నావ్ కామిని. నిను విడిచి వెళ్ళటమనే తలపు నా హృదయాన నిప్పులు చెరగుతోంది. ఈ అవ్యక్తావేదన ఏమని వివరించమన్నావ్. ఈ వియోగము నన్ను జీవన్మృతుని చేయునేమో కామిని!

కా: (బాధగా) ఎడబాటు తప్పదు స్వరూప్. ఎప్పుడూ నీ వద్దేవుండ ఎలా వీలవుతుంది చెప్పు. నీవా, వివాహితుడవు. లోకమేమనుకొంటుంది?

స్వ: ఏమైనా అనుకొనే లోకం నా బాధను అర్థంచేసుకో

లేదుకదా కామినీ! నీవు దూరమైతే యిక నాకు బ్రతుకు బరువౌతుందేమో!

కా: బాధపడకు స్వరూప్. నాకుమాత్రం బాధ లేదూ? జీవితమంతా నీ ప్రేయసిగా వుంటానని బాసచేసానుగా! ఈ హృదయంలో నీకుతప్ప అన్యులకు స్థానం లేదు స్వరూప్. నా జీవితం నీకే అంకితం చేస్తున్నాను. మనుష్యులు దూరమైన మనసులు దూరం కావుగా! ఏదీ, విడిచివెళ్ళే సమయంలోనైనా కలత నొందక కళ కళ లాడుతూ కనుపించరు. (ప్రాధేయపూర్వకముగ)

స్వ: ప్రస్తుతము మా వెంబడి నీవూ రాకూడదూ కామిని!

కా: క్షమించు స్వరూప్. తప్పక వచ్చేదాన్ని. కాని ఈ దినమే నా చిన్ననాటి స్నేహితురాలువద్దనుండి వుత్తర మొచ్చింది. ఆమె వివాహం యెల్లుండి మా వూరిలో జరుగనుంది. నేను తప్పక రావలయునని కబురంపింది. పోకతప్పదు...త్వరలో కలుసుకుంటాముగా!

స్వ: నీ దయ. కనీసం అప్పుడప్పుడు లేఖమూలకంగానైనా నా హృదయ బాధ నోకించుక వుపశమింప జేస్తానని బాసచేయి కామినీ!

కా: తప్పక స్వరూప్! నాకింతగా చెప్పాలా? కళారాధకున్ని చూడాలని నా మనసు ఎప్పుడూ వుబలాటపడుతూ

వుంటుంది. నాకు జీవితాన వేరు ఆశ ఏముంది స్వరూప్?

స్వ: కామిని—కన్యవు. సంప్రదాయ కుటుంబమునకు చెందిన దానవు. పరిస్థితుల ప్రాబల్యమున గృహిణివై నన్ను మరుస్తావేమో!

కా: ఛీ...ఈ అభిప్రాయం నీకెట్లా కలిగింది స్వరూప్. హృదయమొకరికి, తనువు మరియొకరికి యివ్వశక్యమా స్వరూప్. నా హృదయం, కన్యత్వానికి ప్రాణమైన నా హృదయం యేనాడో నీకర్పించటం జరిగింది. మరలా వేరొక వివాహమా! అబ్బ. ఆ మాట అనుకొంటేనే వళ్ళు జలదరిస్తుంది. ఏ పరిస్థితులు నన్ను మార్చలేవు స్వరూప్. నన్ను మీరు పూర్తిగా అర్థం చేసుకోలేరా?

స్వ: క్షమించు కామిని. అర్థంలేని ఆవేదనలో వొళ్ళు మరచి ఏదో వాగి నీ మనసు కష్టపెట్టాను. క్షమించవూ! (అంటూ ఆమెవద్ద కూర్చొంటాడు)

కా: ఎంతపని చేశారండి. లెండి—ఏమిటది (అని చేయి పట్టుకలేపి, తను కన్నీళ్ళు తుడుచుకొంటూ వుండగా) (పద్మాకర్ ప్రవేశం)

ప: స్వరూప్! ప్రయాణానికి వేళయింది. పద!

స్వ: ఇదో వస్తున్నా పద్మాకర్! (మూట సంచి తీసుకొని) కామినీ-శలవు, వస్తాను.

కా: మంచిది. పద్మాకర్ బాబు. వెళ్ళగానే ఉత్తరం వ్రాయండి.

స్వ: చంద్రబాబు ఏడీ?

ప: బండివద్ద వున్నాడు. నీవు పద. (స్వరూప్ నిష్క్రమణ)

ప: అమ్మా కామినీ! ఆప్తురాలవు గనుక ఒక్కమాట విడిచిపోయేముందు చెప్పాలని వుంది.

కా: ఏమిటన్నయ్యా?

ప: మా స్వరూప్ కళాకారుడు. ఉద్వేగ హృదయుడు. ఈప్సితార్థమీడేరక అతని జీవితపథము అంధకార బంధురమైయుండేది. నీ ప్రేమ అతని జీవితమున కొక వెలుగై పురోగమింప దోహదకారి అయింది. కళ కోసం అతని సేవెప్పుడు విడనాడనని బాసచెయ్యాలమ్మా. మా శుభకాంక్షలు మీకెప్పుడూ వుంటవి.

కా: పద్మాకర్ బాబు! నాకింతగా చెప్పాలా!

ప: వెళ్ళివస్తానమ్మా! శలవు!

కా: నమస్తే! (పద్మాకర్ నిష్క్రమణ. కామిని కృంగి

పోయి కుర్చీలో కూలబడుతుంది, స్వహాప్-స్వహాప్ అంటూ—కూర్చొని వుండినచోట కాగితం కనబడు తుంది. తీసుకుని చదువుతూంటే)—

—:తెర:—

## పాట
(నేపధ్యము)

మరణమె శరణము దేవి
దరిశనమీయ, నను దరిచేర, తలపున నుంచక
జాగుచేసినా ॥మర॥

అందించితివదె అందము, పొందించితివి ఆనందము
అది తుది కారాదె—మరిమరి వేడెద
మన్నించుము దేవీ!
కోరిన కోరిక లీడేర్చు కామిని, కలతల నింపకే
కనికరించవే ॥మర॥

——

# తృతీయ రంగము

స్వ: (అందరాని అందమూ, అనే పాట పాడుకొంటూ వుంటే పద్మాకరుని ప్రవేశం)

పాట :

అందరాని అందమా! పొందలేని ఆనందమా!
అదియే చెలియ రూపమా – నాకు తీరని
తాపమా ॥అం॥

అలనాటి ప్రేమగాథలే – మిగిలేన నేటి బాధలై
మరచేనా బాసలన్ని – చెలి – కనుపింపదేలనో ॥అం॥
ఏ దూరదేశ మేగెనో – ఏ దివ్యసీమ చేరెనో
వినరాదా జీవితాన, చెలి మృదుమధుర గీతిక ॥అం॥

స్వ: ఓ పద్మాకర్! రా రా. ఇదేమిటయ్యా, పెళ్ళిచూపుల కని వెళ్ళినవాడివి నెలదాటిన యింటిముఖము చూడ లేదు. కొంపదీసి ఆ కాస్తా అయిందనిపించుకొనే వచ్చావా యేంటి?

ప: (వచ్చి కూర్చొంటూ) పెళ్ళిచూపులకని వెళ్లానేగాని,

మళ్ళీ ఆ పెళ్ళి విషయం యెత్తుకోరాదనే నిర్ణయంతో వచ్చానయ్యా! వద్దురా బాబు.

స్వ: ఏం, చూచిన పిల్ల నచ్చలేదా?

ప: నచ్చిందా, లేదా అనే సమస్యకన్న కఠోరమైన సందేహం నన్ను గృహోన్ముఖుని గావించింది.

స్వ: ఏమిటా విషమ సమస్య?

ప: ఏముంది! పెళ్ళిచూపుల అనుభవాలయ్యాక ప్రేమించి పెళ్ళి చేసుకోవడం మంచిదా? పెళ్ళి చేసుకొని ప్రేమించడం మంచిదా అనే తర్కంలోబడి కడపటికి పెళ్ళి పెడాకులనుకోక సన్యాసిగా బ్రతకటం యోగ్యమని తీర్మానించుకున్నాను.

స్వ: (నవ్వుతూ) మరి మొదటి రెండింటిలో ఏది మంచిదో తేల్చుకోవాలిగాని, ఎటుదప్పి యీ నిర్ణయానికి రావడమేమిటి?

ప: ఏం చెయ్యను మిత్రమా? మొదట సంబంధం చూడటానికి వెళ్ళినపుడు ఏం జరిగిందో చెప్పనా? తీసికెళ్ళి ఉన్నతాసనంపై కూర్చోబెట్టారు. ఇక పెళ్ళి కుమార్తెను తీసుకరావటానికి ఇంటిల్లిపాటు భగీరథ యత్నం

చేశారనుకో! అదేమిటో సిగ్గట బాబు సిగ్గు. ససేమిరా గంట సేపటివరకు బయటకు రాందే. కడకు నలుగు రాడవాళ్ళు చేరి, జబ్బు మనిషిని తెచ్చినట్టు పట్టు కొచ్చారంటే నమ్ము. ఇంతచేసి ఆ అమ్మవారు ఒక చోట నింపాదిగా కూర్చొనేసరికి, ఇక నేనెలా చూస్తానో అని అందరికళ్ళు నాపై బడ్డాయి. అది మనసుకు తోచే సరికి మనకు ఆవరించింది ఆ వెధవ సిగ్గు! ఉహు తలెత్త బుద్ధి కాలేదు. ఏలాగైతేనేం, అలా ఒక్క మారు చూచాను. ఆ చూపు తిన్నగా ఆ అమ్మాయి కళ్ళలోకి పోయిందనుకో. అంతటితో రెట్టింపు సిగ్గుతో క్రుంగిపోయింది. ఆమె ననిపించి అమ్మాయిని లోపలికి తీసికెళ్లారు. వెంటనే 'ఏం అబ్బాయి! అమ్మాయి నచ్చిందా, ఏమంటావ్' అంటూ ప్రశ్నల వర్షం కురి పించారు. ఇక యిలా కాదని, ఏమండీ, నేను ఒక విష యం అనుకున్నాను. కాస్త ఏకాంతంగా అమ్మాయితో ముందు మాట్లాడనలెనన్నాను. అంతటితో ఆ అమ్మాయి తండ్రి కంసుడయ్యాడంటే నమ్ము. ఇదిగో నయ్యా, మాది మర్యాదగల కుటుంబం. ఈలాంటి పిచ్చివేషాలు మా దగ్గర పనికిరావు. ఇక దయచేయ వచ్చు నన్నారు. సరే యిది యిలా ముగిసిందా. రెండో సంబంధం చూడటానికి వెళ్లాను. ఇక్కడ మాత్రం అమ్మాయి సిగ్గు యెగ్గు లేకుండ వచ్చి

కూర్చుంది. సరే మనకు కాస్త సిగ్గనేది వదలిపోవటం చేత, ఆ అమ్మాయితో ముఖాముఖి సంభాషణ మొదలెట్టాను.

"మీకు సంగీతం వచ్చా" అన్నాను.

"వచ్చునండీ" అంది.

"నాట్యంలో ప్రవేశం వుందా" అన్నాను.

"ఉందండి" అంది.

"చదువచ్చా" అన్నాను.

"ఓ బాగానండి" అంది.

"పని వచ్చా" అన్నాను.

"ఓ" అంది.

భలే బాగుందనుకున్నాను.

ఇంతలో ఆ అమ్మాయి "ఏమండి! మీకు సంగీతం వచ్చా"అంది. చచ్చాచురా అనుకొని, 'అబ్బె రాదు' అన్నాను. పోసి సాహిత్యములో చొరవ వుందా? అంది.

కొద్దిగా అన్నాను.

ధనార్జనకు వృత్తి వుద్యోగాలున్నవా? అంది.

ప్రస్తుతము ఏవీ లేవన్నాను.

అంతటితో సుడిగాలిలా బుర్రుమని యింటిలోకి మాయ మైంది. కాబోయ్యే అత్త విధవరాలు "నాయనా బయటికి త్రోవ అది" అని చూపిస్తూ కూతురు ననుసరించింది.

ఇలా రెండు అనుభవాల్లో ప్రేమించి పెళ్ళి చేసుకోవడం మన జీవితాన రాయ లేదనిపించింది. ఇక పెళ్ళి చేసుకొని ప్రేమించటం అంటావా నిన్ను నుకుంటే, మనకు జీవితాన ఎలాంటి ప్రేరణ,గీరణలు అవసరమౌతాయో! ఎందుకొచ్చింది లెమ్మనిపించింది. తుదకు యీ ప్రయత్నం విరమించి ఎట్లాగు బయలుదేరాం కదా నాలుగు పుణ్యక్షేత్రాలు చూచొద్దామని అలా తిరుపతి, కాళహస్తి, కంచి వెళ్ళాను. కంచిలో చిదానంద స్వామి పరిచయం లభించింది. గురుదేవుడన్నాడు కదా. సంసారే దుఃఖి, సన్యాసీ సుఖి. కావున పామరుడా! ఆ సాగరాన పడి చావక మోక్ష సాధనకు ప్రయత్నించూ అని.

సరే, అతని మాదిరి, తిన తిండి కట్ట బట్ట నిలువ నీడ లేక ఎందుకు అఘోరించటం. శాస్త్ర అన్ని హంగులు వుంచుకొని, ఆ పెళ్లాం బాధ ఒక్కటి తప్పించుకుంటే చాలనుకొని గురువు దగ్గర శెలవు దీసుకొని యిలా వచ్చేశాను.

(ఇంతలో హారతి, ప్రసాదం తీసుకొని లక్ష్మి ప్రవేశం.)

లక్ష్మి: ఏం అన్నయ్యా, ఎప్పుడు రాక. మరదల్ని వెంట పిలుచుకొని వస్తావనుకొన్నాము. ఇదో ప్రసాదము (అని ప్రసాదమిస్తుంది.)

ప: ఈ ప్రసాదం మహాత్మ్యాన ఆ కష్టం తప్పిందమ్మా.

ల: అదేమిటన్నా అలా అంటావు.

ప: అంతగాక, నాకెందుకమ్మా ఈ పెళ్లి, పెడాకులు. ఏదో వేళకింత తిని, యిష్ట మొచ్చినట్లు తిరుగాడకుండ అదో గుది బండ. ఇంతకూ మావాడికి ప్రసాదం ముట్టిందా.

స్వ: అ, ఆ, ఆ ప్రసాదం మహత్మ్యాన, నాకు మాత్రం పెళ్లాం గుదిబండగ అగుపించటము లేదు.

ప: (దూరాన వున్న రాధా మాధవుల బొమ్మ వైపు చూస్తూ) ఓ! యిది సంగీత పోటీలలో బహుమతిగా

లభించిన విగ్రహం కదూ? అయితే నిత్య, పూజ, ధూప, దీప నైవేద్యాలు జరుగుతున్నాయన్న మాట.

ల: అబ్బే, అదేం లేదన్నాయి. ధూపం, దీపం, నైవేద్యం నావరకే. ఆయనకు ఎంతసేపూ పూలతో అలంకరించడం, గంటల తరబడి దాన్ని చూస్తూ తన్మయత్వం చెందడం. అంతే.

ప: ఎలాగైతేనేం చెల్లమ్మా! భక్తి అనేక రకములు.

ల: వస్తానన్నయ్యా. వంటకు ప్రొద్దయింది.

ప: ఏం, స్వరూప్! కామిని నుండి సమాచార మందిందా?

స్వ: ఓ, నా జీవిత కుసుమము ఈనాటికి వికసించింది. పద్మాకర్, నేను చాలా అదృష్టవంతున్ని. కామిని మానవ రూపాన యిల వెలసిన దేవత.

ప: నీ జీవిత మొక కుదుట బడింది. అంతే చాలు. ఏదీ క్రొత్తగా వ్రాసిన గేయమొకటి వినిపించు.

స్వ: (తంబుర తంతె బిగించబోతే తంతె తెగిపోతుంది) ఏమిటది. యిలాగయింది.

(ఒక నూతనుడు ప్రవేశించి వుత్తర మొకటి అందించి పోతాడు. పై విలాసం చదువుకొని స్వరూప్ ఉప్పొంగి పోతాడు.)

ప: ఎక్కడ నుండి లేఖ?

స్వ: కామిని నుండి.

ప: పాట విషయం తర్వాత. ఏది విప్పు. నన్ను గురించి అడిగిందో లేదో చూద్దాం.

స్వ: (జాబు విప్పి కొంతవరకూ మనసులో చదువుకుంటూ క్రుంగిపోతాడు. కొన్ని క్షణాల్లో జాబు క్రిందకు వేసి గద్గద స్వరంతో) "కామినీ" (అంటూ తంబుర తంతెలు గట్టిగా త్రిప్పుతాడు. అన్ని తెగిపోతవి.)

ప: ఏమిటిలాగయ్యావు. స్వరూప్! ఏం వ్రాసింది లేఖలో (అంటూ తీసుకొని గట్టిగా చదువుతాడు) (లేఖ) స్వరూప్ మహాశయా! నమస్తే! (స్వగతం) ఏమిటీ సంబోధన! (బాహాటంగా) యీ లేఖలోని విషయాలు మిమ్ములను నిలువునా దహించవచ్చు. కానీ, నిర్వికారంగా నిశ్చల హృదయంతో మీకీ లేఖను వ్రాస్తున్నందుకు క్షమించ గోరుతాను.

ప్రథమ సమాగమములో మీ ప్రేమ నిరాకరించి యుండిన యింతటి బాధ వుండేది కాదు. కానీ యీ సంఘటన కేవలం దైవికం. నేను నిమిత్త మాత్రురాలను. ఈ లోపల నేను నా శ్రేయోభిలాషిని కలుసుకోనుట జరిగింది. ప్రసంగ వశాత్తు మన ప్రేమ విషయం ఆమెకు తెలియజేశాను. ఆమె నా కన్ను తెరిపించింది. కళారాధనే ధ్యేయముగా వున్న సోదరీ, సోదర భావంతో మెలగలేక పోయారా? అని ప్రశ్నించింది. నాకు సమాధానం దొరకలేదు.ఇరువురు విద్యావంతులు; సంస్కారులు-వివాహితుని తోటి సాంగత్యము కూడదని, ఏ ఒక్కరికైన తోచక పోవడం శోచనీయమని, నాచేత మహిళా[illegible]కళంకమునీ నాకెరుకపరచింది. ఆమె [illegible]మె యుండిన కామాన్ని న[illegible]పజేసింది.

అంతే కాదు. కేవలం [illegible]క ప్రేమగా నిల్చుటకు వీలుగాని విధంగా నా హృదయంలో యేదో ఒక వి[illegible] మైన ఆందోళన కలుగసాగి[illegible]ని ఎప్పుడు చూడాలని, ఎప్పుడు కలిసి వుండాలనే వూహాలు వుధృతము కాసాగినవి. అది తోటి సోదరికి అన్యాయం చేసినట్లే.

ఈ పరిస్థితులల్లో నన్ను నేను రక్షించుకోటానికి మీా సాంసారిక జీవితం సాఫీగా సాగునట్లు, చేయటానికి ఈ లేఖ వ్రాయటం తప్ప, గత్యంతరము లేకపోతూంది. స్వరూప్! ఇక మీాదట ఈ కామినిని మరిచిపోండి. ఇక వృత్తర ప్రత్యుత్తరాలతో మనసు పాడుచేసుకొని నన్ను నరకానికి లాగరని ఆశిస్తూ ప్రణామాలతో ముగించు.

"కామిని"

ప: అబ్బ ఎంత కాఠిన్యము. నేననుకొన్నంత అయింది.

స్వ: (ఎకటాషో యోచిస్తూ) పద్మాకరా! ఈ లేఖ నా కామిని వ్రాసినదేనంటావా!

ప: నేననడ మేమిటి. కనబడుతూ వుందిగా దస్తూరి.

స్వ: నేనెందుకో నమ్మలేకున్నానయ్యా.

ప: అలాంటి కులటలను నమ్మనేర్చిన వాడివి యిదేలా నమ్మతావు. ఆనాడే నేను చెప్పానుగా యీా జాతి జాణల తీరు యిలాగుంటుందని.

స్వ: అబ్బా పద్మాకర్! అంతటితో ఆపు. నేను వినలేను. నా మనసేమీా బాగాలేదు. నాకు ఏకాంతమవసరము.

ప: అవును లే! అయస్కాంతములా ఆకర్షించిన పరకాంత ప్రేమ కథను, శోకాంతము చేస్తే ఏకాంతమే శరణు.

స్వ: ఊరిసిన పుండుపై ఉప్పు చల్లడ మెందుకయ్యా!

ప: సరే, వస్తాను. మరల కలుసుకుందాం. (నిష్క్రమణ)

స్వ: (స్వగతం) కామినీ! ఏమిటీ మార్పు. ఎందుకీ వార్త? నీ రాత, నా హృదయపు కోతగా పరిణమించిందే. నిజంగా నీలో యింత మార్పు వచ్చిందా. లోకమేదో అన్నదని, చేసిన బాసల మరచి నన్ను త్యజించాలను కొన్నావా? ఈ వార్త నందించే దానికన్నా నీ చేతి విషమునైనా సంతోషముతో స్వీకరించేవాడినే. మూడు దినాల ముచ్చటే నిన్నింత విరాగినిగా చేసిందా? విధాత ఎందుకు నా తలవ్రాత నింత వక్రం చేసాడు? కారణజన్మురాలవు, నా భావోద్వేగానికి, వెలుతురు నిచ్చె దివ్వెవని, అనుక్షణం నమ్మకున్న వాడిని మరపుల తిమిరంలో మసలుమని శాసిస్తావా దేవి. నిన్ను మరచి మనమంటావా? ఆ కఠోర శాస నము నాకిచ్చేదానవు కోయిలమ్మను కూయవద్దని, నిండు చంద్రుని విహరించవలదని, మయూరిని నాట్య

మాడవద్దని, పువ్వుల వికసింప వద్దని శాసించరాదూ!
ఎవ్వరి కేమని విన్నవించుకోను ఈ హృదయ బాధ.

ప్రియా! ఏ పరిస్థితులలో నిన్ను దూషించ లేను. నువ్వు నిజంగా దేవతవు. కోరనోములు నోనుకొన్న నాకు నీ ప్రేమ పెన్నిధిని శాశ్వతముగా పొందగలిగే యోగం లేదు. నా దురదృష్టానికి నేనే కారణం. యిక ముందు జీవన పయనము ఎలా సాగవలసివుందో ఎవరి కెరుక! మరచి, మరువ మన్నావా కామినీ! నా వక్షస్థలమున శిరముంచి నిదురించండి. బాధలన్ని పోతవని, బుజ్జగించిన దానివి నీవేనా-బృందావన సీమల విహరించాలని వుంది, ఎప్పుడో ఎలాగో యని ప్రేమలొలుక భాషించినది నీవే గదూ! గడచిన ప్రతి సన్నివేశము, స్మృతిపథాన వెల్గి నిలువెల్ల దహింపజేస్తుందే.నీతోటి సాంగత్యము దేవత లంపిన శాపమా చెలీ. నాకది తీరని తాపమా? మనసు మార్చుకో కామినీ? నన్ను కాదనకు. అబ్బ! ఏమిటీ విషాద గాధ. నీ చలువ వలన మనోజ్ఞమైన కవిత చిందే నా కలం యిక చలన రహితం కావలసిందేనా. నీ తలపుల ఫలితంగా మృదు మధురముగా వెలువడే నా కంఠస్వరము మూగబోవల

సిందేనా? తెగిన నా తంబుర తంత్రులు యిక చక్క దిద్దే ప్రాప్తిలేదేమో! అబ్బా! ఏమిటీ ఘోరం? ఎందుకు నా జీవితంతో పరిహాసమాడుతావు కామినీ! యిక కనుపించవూ! నీ తియ్యటి పాట వినిపించవూ! నీ వయ్యారి చేతల నన్నలయింపవూ!

(ఇంతలో లక్ష్మి ప్రవేశం)

ల: భోజనం తయారయింది! వస్తారండీ!

స్వ: (తేరుకొని) ఆ, నాకిప్పుడాకలి లేదు. మీరంతా కానీయండి లక్ష్మి.

ల: అలాగేనండి. (తంబుర చూస్తూ) అయ్యో, ఇదేమిటి? తంబుర తంత్రులు అలా తెగిపోయాయి.

స్వ: ఔను లక్ష్మి! తంతులు శృతి బలుక తయారుచేయ ప్రయత్నించాను. ఒకింత కాలము మ్రోగి ఆకస్మికంగ విడివడినాయి. బెదరిన తంతులు చక్కదిద్ద నా తరము కాదనిపిస్తోంది.

ల: అదేమిటండి. విజ్ఞులు ప్రమాదవశాత్తు విచ్యుతి నొందిన

తంతులు సవరింప నశక్తులా! మీకంత చేతకాదనిపిం
చితే నే సవరిస్తాను, సరేనా?

స్వ: (పరధ్యానంగా) అది నీవల్లకాదు లక్ష్మి! నీవల్లకాదు.
నేనలా బయటకు పోయి వస్తాను. తరువాత భోంచేయ
వచ్చు!

ల: అలాగేనండి. (చెరి యొకవైపు నిష్క్రమణ)

—:తెర:—

——

# తృతీయాంకము

## ప్రథమ రంగము

(స్వరూప్ గృహం. తెర లేవగానే లక్ష్మి యిల్లు శుభ్రము చేస్తూ వుంటుంది. చంద్రబాబు ప్రవేశం)

చం: స్వరూప్ మహాశయా!

ల ఇంటిలో లేరండి! ఓ చంద్రబాబుగారా! కూర్చోండి ఇదేనా రావటం.

చం: ఔనమ్మా! గృహ యజమాని ఎక్కడమ్మా?

ల: గాలి మార్పు కోసం నిన్ననే తిరుపతికి వెళ్లారు! నాలుగు రోజుల దాకా తిరిగి రారు. రండి, కూర్చోండి. (కూర్చొన్న తరువాత) చాలా కాలానికి దయచేసారు. విశేషాలేమిటి చంద్రబాబు!

చం: ఏముందమ్మా! మా గ్రామంలో సత్యనారాయణ వ్రత సన్నాహాలు సంబరముగా జరుగుచున్నవమ్మా! పుర ప్రజలు స్వరూప్ మహాశయుని పాట విన వువ్విళ్లూరు చున్నారు. ఆహ్వానించ వచ్చానమ్మా!

ల: మంచిదే చంద్రబాబు! కాని వారు యిప్పటిలో ఆహ్వాన మంగీకరిస్తారనే నమ్మకం లేదు.

చం: అదేమిటమ్మా?

ల: వారీలోగా పాడటం మానుకొన్నారు చంద్రబాబు. దేహారోగ్యం కూడ సరిగా లేదు. అలా చూడండి. ఆ వాయిద్యము తంత్రులు తెగి బూజు పట్టి ఎలా మూల పడిందో!

చం: (మూలకు చూచి) చాలా విచారకరమైన విషయ మమ్మా? (యోచించి) అక్కడా యిదే పరిస్థితి. (అని పరధ్యానంగా అంటాడు)

ల: ఎక్కడ చంద్రబాబు! ఏమిటి?

చం: (తేరుకొని) అమ్మా! యీలోగా కామిని యిక్కడ కొచ్చారా!

ల: కామినియా! ఎవరు చంద్రబాబు.

చం: కామిని మీకు తెలియదామ్మా!

ల: నేనెప్పుడు చూడలేదు! ఆ పేరుగూడ వినలేదే! ఎవ రామె చంద్రబాబు!

చం: మీకీవరకే తెలియు ననుకున్నానే. ఆమె ఒక కళా కారిణి. మా గ్రామం సంగీత పోటీలలో అయ్యగారితో పాటు బహుమతి గ్రహించిన మేటి గాయని.

ల: (చెప్పినంతసేపూ యోచిస్తూ వుండి) అలాగ చంద్ర బాబు! అక్కడ యిదే పరిస్థితి అని యిందాక అన్నారే! ఆ గాయనిని ఆహ్వానించ వెళ్ళివుండినారా!

చం: ఔనమ్మా.

ల: ఏం జరిగింది?

చం: ఏదోలే అమ్మా! ఇంతకూ నే బయలుదేరిన కాలం బాగాలేదు. నే వస్తానమ్మా!

ల: ఇప్పుడెక్కడికి వెళ్తారు! ఆయన వచ్చేవరకు వుండండి చంద్రబాబు.

చం: మీరు చెప్పే విషయాలు విన్నాక, ఆ తంబుర గతి చూచాక యిక వారితో ఈ విషయం ప్రసంగించ టానికి నా మనస్సొప్పటం లేదమ్మా! మరోమారు కలుసుకొంటాను. నే వచ్చినట్టు కూడ గృహ యజ మానికి తెలియజేయకమ్మా! వస్తాను. (అంటూ మాట వినిపించుకోకుండా వెళ్ళిపోతాడు.)

ల: కామిని...గాయని.

(చంద్రబాబు వెళ్ళినాక లక్ష్మి కొంతసేపు యోచించి స్వరూప్ పుస్తకము తెరిచి ఒక జాబు బయటకు తీసి మనసులో చదువుకొని మరల యథాస్థానములో పెట్టి) కామిని! యింతకాలము నా స్వామి దైన్యానికి కారణం పసిగట్టలేక పోయాను. యింతటి హాలాహలాన్ని కడుపున దాచుకొని బాధ పడుతున్నారా! ఈ కామిని, మీ హృదయపీఠము నధిష్టించి వుండినదా స్వామి! అయినా ఈనాడు నా స్వామిని కాదనిందా! ఔను, పాపం ఆమెది కూడ తప్పు లేదు. ఒకవైపు నేను, మరో వైపు సంఘం. మరి ఈ సమస్యకు పరిష్కారమే లేదా! లేకేం, ఉంటుంది. ఉండి తీరాలి! ఉండి తీరాలి!

(ఇంతలో పద్మాకర్ ప్రవేశం)

ప: ఏమిటమ్మా! ఏదో నీలో నీవే ఆవేశంగా మాట్లాడు కుంటున్నావ్! స్వరూప్ యేడి!

ల: రా! అన్నయ్యా! కూర్చో! వారిప్పుడే అలా బయట కెళ్ళారు. (పద్మాకరు కూర్చొన్నాక)

ల: అన్నయ్యా!

ప: ఏమమ్మా!

ల: మీ మిత్రులు నానాటికీ కృశించి పోతున్నారు. ఏమీ పాలుపోవటం లేదు! నీకేమైనా చెబుతున్నారా?

ప: అబ్బె. ఏమి లేదమ్మా! నాతో ఏమి చెప్పటం లేదు. ఒంటిలో సుస్తిగా వుందన్నాడు.

ల: అంతేనా అన్నయ్యా! అంతకుమించి వారి విషయం మీ కేమి తెలియదా!

ప: తెలియదమ్మా! ఏముంటుంది.

ల: నిజం దాచటం చెల్లెలికి మేలు చేయటం కాదు అన్నయ్యా! ఏమంటారు!

ప: అదేమిటమ్మా! అదోరకంగా మాట్లాడుతున్నావ్!

ల: ఏం లేదన్నయ్యా! కామిని ఎవరో మీకు తెలియదా!

ప: (ఆశ్చర్యంగా) కామిని...ఆ! ఆమె నీకెలా తెలుసు లక్ష్మీ!

ల: పోనీ యిప్పుడైనా వున్న విషయం వివరంగా చెప్ప రాదూ అన్నయా! వారు నానాటికి కూడు నీరు విడిచి వాడి వత్తులై పోతూవుంటే నా హృదయం భగ్గు

మంటూ వుంది. మా శ్రేయోభిలాషివి నీవే యిలా మౌనంగా వుంటూ, వాస్తవాలను మరుగు పరచి నడుస్తూంటే నా గతి యేం కానన్నయ్యా. నీ సోదరి క్షేమం సౌఖ్యం నీవు కోరటం లేదా! నీవు కూడ ఇంత అన్యాయముగా చరిస్తావా?

వ: క్షమించమ్మా! వున్న విషయాలు నీ దృష్టికి తెస్తే మరింత దుఃఖముతో నీవు క్రుంగిపోతావనే నేను మూగవాడి నయ్యానమ్మా! ఏమయితేనేం, నీవు యీవరకే విషయం గ్రహించగలిగినట్లు వ్యక్తమౌతుంది. నేను యింక దాచటానికేముందమ్మా.

కళారాధకుడైన నీ భర్త, కళామూర్తియైన కామినితో పరిచయమేర్పడినది. ఆ కలయిక అతనిలో కరుడుగట్టియుండిన కళాపిపాస కరిగి వెల్లువలై పార దోహదకారి అయ్యింది. ఆ స్రవంతి సృజనాత్మకమైన అతని కవితా హృదయసీమపై పొంగి పొరలేసరికి, కావ్యవృక్షం పెరిగి పెద్దదై ఆరు పువ్వులు నూరు కాయలు కాసింది. అదంత మంచిదే ననిపించింది. కానీ కాలగతిలో కామిని తన విధిని నెరవేర్చలేకపోయింది. ఆ ఫలితంగా చెలరేగిన తుఫాను, యీ కవితా వృక్షాన్ని యీనాటికి కూకటి వేళ్ళతో పెకలించివేసింది. అతని మనోజ్ఞ హృదయం బీటలు బారిపోయింది. ఎండిన

హృదయపు లోతులోని అగ్నిశిఖలు అతని నఖశిఖ పర్యంతము కాల్చివేస్తున్నవమ్మా!

కాలపు గతిలో కొంత వుపశమనం కలిగి కొంతవరకు మరచి మనకలుగుతాడనీ, యిది తెలిస్తే నీ జీవితాన మరొక దవానలము రగులుకొంటుందనే భయంతోను, నేను మౌనం వహించాను. అంతేనమ్మా, అంతే.

ల: అన్నయ్యా, ఆయన తీరు గమనిస్తే, మరచి మనగలిగే విధానం కనబడటం లేదు. నాకు విషయం తెలిస్తే బాధపడుతానని యెలా భ్రమించావు? వారి సుఖంకన్న నాకాకాంక్షించదేముంది చెప్పు. నేనివ్వలేని ఒక దివ్య ప్రేరణ నా భర్తకొసగి అతని జీవిత విధాన వెలుగు చిందించ నోచిన ఆ కామిని నాకు కూడ ఆరాధ్య దేవతే నన్నయ్యా. ఇప్పటికైన మించిపోయింది లేదు. నీవు వెళ్ళి ఆమెను ఇక్కడకు తీసుకరా అన్నయ్యా.

ప: అమ్మా లక్ష్మీ!

ల: ఔనన్నయ్యా. నా యిష్టము మీదటే ఆమె యిక్కడ వారితో కలిసివుంటే, ఇక లోకాని కనటానికేముంది. ఆమె రాక నా భావి జీవితానికి నవ వసంతములాగైన పుడు ఆమె నాకు ద్రోహం చేసినట్లు ఎలా అవుతుంది. వెళ్ళిరా.

ప: అమ్మా! దేవతా స్వరూపము కామిని కాదమ్మా నీవు. నిన్ను భార్యగ పొందిన స్వరూప్ అదృష్టవంతుడు కాని నే వెళ్ళినా ఆమె వస్తుందనే నమ్మకం లేదమ్మా

ల: ఔను-ఆమె వ్రాసిన లేఖ నేనుకూడ చూచా నన్నయ్యా! కాని ఆమె రాలేనందుకు కారణం నేను బాగా వూహించుకో గలుగుతాను. ఆమె లేఖకు సమాధానంగా నేనొక లేఖ నిస్తాను. అది ఆమె కందజేయి అన్నయ్యా! సరేనా!

ప: ఏమోనమ్మా, ఆ మనిషి, కపటి, కాఠిన్యురాలు, మన ప్రయత్నం ఫలించదేమో!

ల: ఆమెను దూషించకన్నయ్యా! ఆమె తప్పేమిలేదు. పైన, యికమీదట, ఆమే నేను, నేనే ఆమె. నన్ను చూచి నట్లే ఆమెను చూడాలన్నయ్యా, ఏమంటావ్!

ప: ఏమనగలనమ్మా! నీవో వెర్రిబాగుల దానివంటాను, సరే! నీమాట ఎందుకు కాదనవలె, వ్రాసి యివ్వమ్మా.

ల: (జాబు వ్రాసి-అతికించి యిస్తుంది. వ్రాస్తూ వున్నంత సేపూ, ఆమె ముఖ కవళికలు మారుతూ వుంటాయి. కాని నిశ్చలత తెచ్చి పెట్టుకుంటుంది.)

అన్నయ్యా! చిన్న మనవి. ఈ లేఖ స్త్రీలకు సంబంధించింది. నా జీవితానికి సంబంధించినది. కావున ఒక్క కామిని మాత్రమే చూడవలె, సరేనా!

ప: అలాగేనమ్మా. వస్తా. (అంటూ వుత్తరం తీసుకొని నిష్క్రమణ)

ల: అమ్మా పరమేశ్వరీ! కళా తపస్వియైన నా భర్తకు తగిన అర్ధాంగిని కాలేకపోయాను. నా బ్రతుకు అతని ఉజ్జ్వల భవిష్యత్తుకు ఒక ప్రతి బంధకము. పరిపూర్ణ ప్రేమిక హృదయాలలో పరిస్థితుల ప్రాబల్యంవల్ల వొకొక్క మారు కామవాంఛ కలుగవచ్చు. ఆ కామవాంఛ నణచుకొని జీవితమంతా కలిసి మెలసి వుండటం అతి కష్టమనిపించవచ్చు. కామిని భావన సరియైనదే. కావున నేను సజీవంగా వున్నంతకాలము కామినివంటి పవిత్రురాలు నా భర్త కోరిక నంగీకరింపకపోవచ్చు. ఇంతకు ఈ కారణంవల్ల నా భర్త కళామతల్లి సేవ చేయలేక పోవడం, నే సహించలేను. ప్రేమ యోగినిగా నా సర్వస్వాన్ని త్యాగంచేసి, కళ కోసం నిన్ను చేరుకొన నన్నాశీర్వదించమ్మా. (అంటూ నిష్క్రమణ)

—: తెర :—

# ద్వితీయ రంగము

(తెర యెత్తేసరికి కామిని గృహం. కామిని, చంద్రబాబు కూర్చొని వుంటారు.)

చం: నే నిప్పుడే కళ్యాణపురం నుండి వస్తున్నానమ్మా.

కా: ఓహో! స్వరూప్ మహాశయులు బాగా వున్నారనుకొంటాను. మీ ఆహ్వానమంగీకరించారా?

చం: లేదమ్మా! ఈలోగా ఆయన గాన కళ నభ్యసించుట మాని వేసారట. నల్లు సుస్త్రీజేసి గాలి మార్పుకోసం యెచ్చటికో వెళ్లారని విన్నాను.

కా: (నిశ్చలంగా) పాపం.

చం: అమ్మా! మీరు అన్యధా భావించకపోతే ఒక చిన్న విషయం.

కా: ఏమిటి చంద్రబాబూ?

చం: స్వరూప్ గారితో మీరు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపటం లేదా.

కా: లేదు.

చం: ఎందుచేతనో తెలుసుకోవచ్చా!

కా: చెప్పటానికేమీ లేదు చంద్రబాబు. మరో విషయం ఏదైనావుంటే-శలవిస్తారా!

చం: క్షమించమ్మా! నేను ఏదో తెలుసుకోవాలనే కుతూహలంగా యిచ్చటికి వచ్చాను. ఆ ప్రసక్తి వద్దన్నాక నేనింకేం చెప్పగలను.

(ఇంతలో పద్మాకర్ వుత్తరం తీసుకొని వస్తాడు)

చం: ఓ. పద్మాకర్ గారా, ఇదేనా రావటం.

కా: (గుర్తులేనట్టు) ఎవరండి వీరు.

చం: అదేమిటమ్మా! స్వరూప్ గారి మిత్రులు.

స: జ్ఞాపకం లేదా అమ్మా! అమ్మా కామిని! నీలో వచ్చిన మార్పు మనుష్యుల మరిచేవరకు ముదిరింది. కాని నేనొక కార్యార్థినై వచ్చాను. మీరు నన్ను అవమానించిన, నా పని నెరవేర్చక తప్పదు. ఇదిగోనమ్మా. స్వరూప్ అనే అభాగ్యుని భర్తగా పొందిన వుత్తమ యిల్లాలు మా లక్ష్మి నీకీ లేఖ నందజేయమంది. ఇది చదివి నీవిచ్చే ప్రత్యుత్తరమేదో తీసుకరమ్మని పంపింది. అందుకొచ్చానమ్మా!

కా: (ఆశ్చర్యంగా) స్వరూప్ సతి నాకు లేఖ వ్రాసిందా! ఏమిటది? (జాబు చించి మనసులో చదువుకొని, ఎలుగెత్తి దుఃఖపూరితముగా) పద్మాకర్ బాబు! ఈ లేఖ మీరక్కడ చూడకనే తెచ్చారా? ఏమిటది? అబ్బా. ఘోరం లక్ష్మీ. అమ్మా లక్ష్మీ.

ప: ఏమమ్మా! లేఖలో ఏముంది. నీవు తప్ప అన్యులెవ్వరు ఈ లేఖను చదువరాదని చెల్లి షరతుపెట్టినందున నే చూడలేదు. ఏముందమ్మా అందులో?

కా: ఇంకేముంది పద్మాకర్ బాబు. కొంప మునిగింది. లక్ష్మి ఈపాటికి మన లోకాన్ని వదలి వెళ్ళి వుంటుంది.

ప:చం: ఆ! ఏమిటి ఘోరం! ఏమిటో, ఎందుకో చెప్పమ్మా?

కా: ఇప్పుడు మాటలాడటానికి సమయం లేదు. పదండి పోదాం. ఎంత పని చేశావమ్మా లక్ష్మీ! (ముగ్గురు నిష్క్రమిస్తారు.)

---

# తృతీయ రంగము

(లక్ష్మి మృత కళేబరం. ఒకవైపున కామిని, మరొక వైపు పద్మాకర్, చంద్రబాబులు కూర్చొని వుంటారు)

ప: చెల్లెమ్మా! ఎంత దారుణానికొడి గట్టావ్! నా జీవితానికి సంబంధించిన లేఖ నీవు చూడరాదన్నపుడు, నేనే కామిని, కామినే నేను, అన్నపుడు నీ మాటల లోని అంతరార్థాన్ని గ్రహించలేకపోయానే! నీ భర్త సుఖం కోసం, నీ స్థానంలోకి మరొక యువతి నాహ్వానించి తప్పుకొన్నావా త్యాగమయీ! ఇంతకూ ఈ మారణహోమానికి నన్ను వినియోగించుకొన్నావా, చెల్లీ! పతియే దైవమని నమ్మి, దైవ చింతతో కాలం గడిపే నీకా యీ దుర్మరణం. స్వరూప్ ఇంటలేనిది చూచి ఇంత సాహసం చేశావా చెల్లి! అతడు రాగానే గుండె నీరై నిన్ననుసరిస్తాడేమో! అబ్బ! ఎంత దారుణం.

చం: పద్మాకర్ బాబు! ప్రసంగవశాత్తు నోరు జారి అమాయకంగా, కామిని పేరు ఆమెవద్ద ఎత్తి నేను ఆమె చావుకు కారణ మయ్యానయ్యా! కామిని చర్యను లోకం గర్హించకుండవుండుటకు తన భర్త ఆమె సాన్నిధ్యంలో తన్మయత్వమొంది కళాసేవ చేయుటకు, వీలు కలిగించ తనువు చాలించిన లక్ష్మి స్త్రీ జాతికే ఒక వెలుగు.

కా: లక్ష్మీ! అక్కయ్యా. నా వక్రచేష్ట లింత విపరీతానికి దారి తీస్తాయని నే నూహించలేదమ్మా. నా కఠిన హృదయం కరగటానికి, నీ రుధిరతర్పణ మవసర మని పించిందా అక్కా! నీవీ త్యాగము చేసేకన్న సంతోషంగా నేనే నీకోసం నా ప్రాణాలర్పించి వుండేదానినే. దీనికంత మూలం నేనే, నేనే. నీ భర్త ప్రియురాలిగా నుండుట కంగీకరిస్తే నీకాత్మ శాంతియని వ్రాసావే చెల్లి. నీ పవిత్రప్రేమ ముందు నా అనురాగ మెంత, నీ కళావిశిష్టత యెంత, నా రూప మెంత, నీ కాలి గోటికైన ఎనగానమ్మా. (ఇంతలో స్వరూప్ ప్రవేశం. చేతిలో సంచి, మాసిన గడ్డం, దుస్తులు)

స్వ: ఏమిటిది? కామిని, పద్మాకర్! ఏమిటిది పద్మాకర్? లక్ష్మి.

ప: ఇంకెక్కడి లక్ష్మి స్వరూప్!

స్వ: ఆ! (తాకి చూచి) లక్ష్మి, లక్ష్మి (ఏడుస్తూ) నా లక్ష్మి ఎందుకిలా తయారయింది. పద్మాకర్! ఏమిటిదంతా?

ప: ఏముంది స్వరూప్, కామినికోసం నీవు వ్యథ నొందుతున్నావని తెలిసికొన్న లక్ష్మి, ఆమె నీతో వుండ ఆహ్వానించి తాను మరో లోకానికి పయనమయింది.

స్వ: ఆ! అబ్బ! లక్ష్మీ! ఈ పాపికోసం ప్రాణత్యాగం చేశావా! నా సుఖంకోసమా! నీవు లేనిదే నాకే సుఖం లేదు. లక్ష్మి నాకే సుఖమూ లేదు. నా మానసిక బల హీనత నీపాలిటి యమపాశమయిందా! లక్ష్మి, నీవు

విడిచిపోయి నన్ను సుఖపడమంటావా! కళాసేవ చెయ్యమంటావా, బ్రతికి వున్నపుడు నిన్ను చులకన చేశానా! నాకిది చాలని ప్రాయశ్చిత్తం. నీవు లేని జీవితం నాకు మాత్రమెందుకు. నేనూ నీవెంటే వస్తాను. నన్ను క్షమించు లక్ష్మి. (అని ఒక మూలకు పోయి, కైజారు తీసుకొంటాడు)

కా: (ఏడుస్తూ) వద్దు, వద్దు, స్వరూప్ బాబు. ఆగండి. దీనికంతా బాధ్యురాలను నేను. నేను పాపిని, పచ్చని మీ సంసారాన నిప్పు పెట్టాను. మొదలు ఆ కత్తికి నన్నాహుతి చేయండి. ఆ తల్లిని అనుసరించి మరో లోకంలోనైన క్షమాభిక్ష కోసం వేడుకుంటాను. నన్ను మన్నించండి స్వరూప్ బాబు. యిలా ఇవ్వండి. (అంటూ కత్తి గుంజుకోబోతుంది. ఇద్దరూ పెనుగులాడుకొంటుంటారు. చంద్రబాబు, పద్మాకరు చెరిమొకరిని ప్రక్కకు లాగి)

చం: ఏమిటది స్వరూప్ బాబు! ఆవేశంలో వళ్లు మరచి ప్రవర్తించకండి. జరిగినదానికి వగిచి ఫలమేమిటి.

ప: అమ్మా, కామిని! ఏ పునస్సంధానము కోసం, నా చెల్లి తన జీవితాన్ని బలిపెట్టిందో అది యిక జరుగవలె. చావులతో సాధించేదేముందమ్మా! అదేమిటి! (లక్ష్మి చేతిక్రింద వున్న జాబు తీసి గట్టిగా చదువుతాడు.)

(లేఖ): పూజ్యులైన శ్రీవారి చరణసన్నిధికి-లక్ష్మి నివేదించుకొన్న తుది మనవి. స్వామీ! నాలోని లోపము లెంచక నన్నెంతో ఆదర ప్రేమగా చూచుకొంటూ

వుండిన, మీతో తుదిమాటలైనా చెప్పక వదలి పోతూన్నాను. మీరు ఎల్లపుడు సుఖంగా, ప్రశాంత హృదయులై, కళామతల్లిని ఆరాధించి ధన్యులవ్వాలనే కోరికతో, నా సోదరి కామినిగా నేను మీకు కన్పిస్తాను. చెల్లి కామినిలో నన్ను చూస్తూ కళాసేవ చేయండి. స్వామీ!శలవు. అశువుల బాసిన నా కోసం మీరే మాత్రం చింతించిన, ఎట్టి సాహసాని కొడిగట్టినా నా ఆత్మకు శాంతి చేకూరదు. నా అంతిమ కోరిక చెల్లిం చండి స్వామి. కామినిని స్వీకరించండి. కళకు ప్రాణం నియ్యండి.

తమ చరణదాసి

లక్ష్మి.

కుమారి కామినికి. చెల్లీ–నా జాబు చూచి నీవు నన్ను మన్నించి యిచ్చటికి వచ్చి వుంటావనే నమ్మకముతో వ్రాస్తున్నాను. నేను విగత జీవినైనా, నీలో వుంటాను. స్వామిని నాకు మారుగా స్వీకరించి, వారినెపుడు వదలకు. వారి కావ్యరచనకు, గానకళకు ప్రేరణవై ఉండవలెనని మృత హస్తాల ఆశీర్వదించు—

మీ అక్క–

లక్ష్మి.

చం: స్వహూప్ బాబు. లక్ష్మి ఆత్మ శాంతికొరకు మీ యిరువురు దాంపత్య జీవితం సాగించక తప్పదు. ఆమె

అంతిమ కోరిక, ఆ త్యాగమయి మీకిచ్చిన శాసనం. ఆ కళేబరముపై చేతులనుంచి, శపథం చేయండి. మీ రెడబాయని జంటగా మెలగి, ఆ దేవతపై, ఆమె ఆశయాలపై గేయ రచన సాగించి లోకాని కందజేయండి.

అవి మృత హస్తాలు గావు! అమృత హస్తాలు! ఆ అమృత హస్తాల ఆశీర్వాదం పొందండి.

ప: అంతే స్వరూప్. అంతకన్నా చేయదగినది యింకేమి లేదు.

(కామినీ స్వరూప్‌లు మౌనంగా తలలు వంచి, మృత కళేబరంపై చేతులుంచుతారు.)

ప:చం: ఓం శాంతిః, శాంతిః, శాంతిః.

(అంటూ వుండగా తెర)